# ఆర్తరక్షామణీశతకము.

శ్రీమదిందిరారమణచరణారవిందసేవా తత్పరుండును, శ్రీకులగాముపురి నివాస
వాస్తవ్యుండును, శిష్టపాలక కులశ్రేష్ఠుండును, దేహరాజవంశ సంజాతుం
డును, శ్రీచినరామకృష్ణార్య పౌత్రుండును, శ్రీరాధాకృష్ణార్య
పుత్రుండును నగు

## శ్రీ అనంతరామయ పట్నాయక

కవివరునిచే రచింపబడినది.



పబ్లిషరు :

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.



బెజవాడ: ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడినది.



1935.

 [0-2-0.

# శారదాస్తవము.

సీ॥ శారదోన్మేష శ◆శ్వద్భవనసంజాత
సురుచిరవక్త్రి యే ◆ సుందరాంగి
లలితగానవిలాస ◆ విలసితవల్లకీ
కలితహస్తాబ్జ యే ◆ కంబుకంఠ
సాంద్రచంద్రవిలాస ◆ సముదిత చంద్రికా
హాసనంకలిత యే ◆ యంబుజాక్షి
విపులవిద్యుల్లతా◆విలసితలావణ్య
కలితసంహనన యే ◆ కీరవాణి

గీ॥ సకలసద్గుణరాశియే ◆ చంద్రగంధ
యెల్లవిద్యల కాలయ ◆ మే వెలంది
యట్టి గీర్వాణి యలివేణి ◆ యజునిరాణి
చెలగి మత్కావ్యసంసిద్ధ ◆ జేయుగాత.



# ఆర్తరక్షామణీశతకము.

శా॥ శ్రీకాంతాహృదయప్రకీర్ణజలజ ♦ శ్రీభాస్వదుద్యత్ప్రభా
లోకేశప్రతికూలశైలవిస♦ద్వృద్ధశ్రీవప్రాభవా
నేకస్ఫారలసద్ఘనాఘునగీతో♦న్మేషప్రతీకప్రభా
లోకామ్నాయచతుర్వివాక వనమా♦లీ యార్తరక్షామణీ! ౧

శా॥ భూతాఘేశగుణప్రభాసితదిశా♦భాగ్యైకలోకస్తుతా
వీతద్రోహాదురంతమర్మదలస♦ద్విఖ్యాతిసర్వంసహా
ధూతక్లేశవికీర్ణదైన్యవిపుల♦ద్వేలాభ్రజంఝానిలా
తీతా సర్వజగత్ప్రకాండ యఘుభే♦దీ యార్తరక్షామణీ! ౨

మ॥ సుమనప్రార్థితనిర్వికల్పగుణరా♦శీ నీవినోదంబు లే
క్రిమము నోర్బల్పక మోహసంభృతవికీ♦ర్ణ భ్రాంతిచేతస్కులై
రమితప్రాభవు లప్రమేయు లజరు♦ద్రిప్రాగ్ద్రిశాఘేశులు౯
దమము స్వీడనివారి కెట్లొద వనం♦తా యార్తరక్షామణీ! 3

మ॥ పరగ న్బూర్వభవంబున న్గల మద♦ప్రావీణ్యదుష్కర్మసా
గర నభ్యంతరభాగమం దఖిలను♦గ్రక్లేశనీచీపరం
పరలం జిక్కితి నీదుపాదముల దా♦ప న్నానచే నిత్తరి౯
వెరపు న్మాన్పి దరింపజేయు మిక తం♦డ్రీ యార్తరక్షామణీ! ౪

## ఆర్తరక్షామణీశతకము.

మ॥ తరిమైన న్గని బ్రోతు వంచనుట వా♦స్తవ్యంబునం దీవు నా
దరము న్గాని యవస్థల న్బడు టనాథ♦క్లేశముల్గావె నీ
పరమప్రీతి దొలంగియుండు టది బో♦ల్ప న్బ్రిగ్యలోపంబు తె
ల్లరయ న్నీకరుణం దొలంగితివి దే♦వా యార్తరక్షామణీ! ౫

మ॥ నిరతి న్మృత్కలితప్రకీర్ణ కనకో♦న్మేషంబును న్బోలె నీ
పరమోద్వేలలసత్కటాక్షవిమల♦ప్రవ్యక్తభావంబు ని
ర్భరకౌటిల్యరసప్రమాదయుతమై ♦ బల్దీవు లొందె న్గుణా
కర! నింకేది తెరంగు దెల్పు మకలం♦కా యార్తరక్షామణీ! ౬

శా॥ సర్వావస్థలచే నభేద్య మగు సం♦సారంబును న్బోల్పగా
ఖర్వక్లేశవికీర్ణమానసవిలస♦త్పాశావిలగ్నంబు బల్
దుర్వారోగ్రతరప్రమాదయుతముఁ ♦ దుర్వ్యాప్తికి న్మూలముఁ
నిర్వాణప్రతిబంధకంబు గొను దం♦డ్రీ యార్తరక్షామణీ! ౭

శా॥ ఆపద్విశ్వములెల్లయు న్బ్రబలె మ♦త్ప్రాణంబులు న్నొవ్వగా
నీపట్లం దెరగేది గన్గొనను దం♦డ్రీ నీయుపేక్షస్థితిన్
లోపంబుల్ నెలకొంటి బోల్పవు దయా♦లోపంబు లాద్యంతముఁ
లోప ల్పెట్టిన హాని గల్గు నయవే♦దీ యార్తరక్షామణీ! ౮

మ॥ పదిలంబుం జనజేయరా వలతి యా♦పద్బంధుడా గావె నీ
బదను న్బోవ దలంపుజేసితి నసం♦భావ్యంబు గాకున్న నే
డిది సందర్భముగాదె నీవలన దం♦డ్రీ బోల్వరా డింతకున్
గుదుకాగాదె దయావిలోకనస్వయం♦భూ యార్తరక్షామణీ! ౯

మ॥ కడుపార న్భుజియించినన్బలె మదీ♦య క్రూరకర్మంబులన్
గడు బాపంబులు నిండియుండె నిరయ♦గ్రాసంబులం జేకొనన్
గడువు న్నీవల్పకే లేశమాత్రము నిను ♦ న్గాంక్షింప లేనట్టి బల్
జడుడ న్న న్నిట బ్రోవు దీనజనపో♦షా యార్తరక్షామణీ! ౧౦

శా॥ ఓకారుణ్యపయోధి నాయడరు ♦ వోవంజేయ వెల్లైన బల్
గాకి న్బోలె మెలంగితి న్నిఖిలము ♦ న్గాంక్షించి బల్రీతులన్
నాకు న్నీవ్వడు నంత దుర్యశము నే ♦ నార్జించితిన్ దీని ను
ద్రేకంబున్ దగ దేను దీనుడను దం♦డ్రీ యార్తరక్షామణీ! ౧౧

శా॥ దేవా! బ్రోవు మటంచు మ్రొక్కలిడినన్ ♦ దైన్యస్థితు ల్వాపగా
నీవెల్లప్పని నేర్పున న్గారతి తె♦న్నోదిచిన్ మున్నెన్నికల్
దీవుల్ సన్నిటిలోన జేకొనుచు నే♦దోజూతుమంచియ్యెడన్
దీవిందప్పిన నింద్యమొందెద ఘభే♦దీ యార్తరక్షామణీ! ౧౨

మ॥ యెరవు న్గొన్నగలాపము న్బలె వినిం♦ద్యోద్యోగవర్ధిష్ణులౌ
పెరవారి న్వలనొప్ప నిర్దయులస♦త్ప్రేమానురాగంబు లే
విరివిన్ దాల్పగ నేరవి ట్లనిశ మీ♦పున్నాక నొందేది నా
కరయ న్గన్పడ దియ్యెడ న్నయవిలో♦కా యార్తరక్షామణీ! ౧౩

మ॥ శరణార్థిం దయమాలియుంటివి ననున్ ♦ సర్వేశ నీసత్కృపా
శరధి న్మ్రొల్కలు వేయున ట్లలతియున్ ♦ సందర్భముల్గాగ నా
దర మొప్పన్ జనజేయవే మిగుల ♦ నాపద్బంధుడౌ నన్న నీ
బిరుదుల్ యెల్లజగద్వికీర్ణము స్వయం♦భూ యార్తరక్షామణీ! ౧౪

మ॥ అపరాధంబులొనర్చితి న్మిగుల దా♦నన్ జిత్రగుప్తాహ్వయ
ప్రభు లేరీతి లిఖింతురో శమను లో♦పన్ నైజ మెట్లుండునో
కపటాత్మీయు లనేకకింకరమనః♦కాపేయము ల్బల్పరా
దభయస్థం బిడిమెట్లుబ్రోతువో విధా♦తా యార్తరక్షామణీ! ౧౫

శా॥ కాకి న్బోలె జగంబులన్ దిరిగి మ♦ద్గ్రాసంబు గన్గొన్న బల్
గాకి న్గన్గొను దిక్కుమాలితి మదిన్ ♦ గొంతైసగా పేయ మీ
దిక్కు న్గల్గ దశేషదైన్యవితతిన్ ♦ దాల్కొంటి నా కియ్యెడన్
జేకూర్పన్ దలపొప్పదే యఘవిదా♦రీ యార్తరక్షామణీ! ౧౬

మ॥ అకలంకస్థితి లేక నస్మదఖిల♦ప్రారంభముల్ దప్పులై
మిగులన్ దత్కలితప్రమాదవితతు♦ ల్మిన్నంది బాధించె న
న్నకలంకస్థితి నొందజేసి నయము♦ న్నాపట్ల సంధించి నా
వికలత్వంబు దొలంగజేయు మఘభే♦దీ యార్తరక్షామణీ! ౧౭

మ॥ పరగ న్విశ్వము లోకకృతీరున భవ♦త్ప్రావీణ్య సందర్భముల్
యురుదండ న్గొని బంతుల ల్గెలిమి స♦న్యాభేదము ల్గాక ని
ర్భరచాతుర్య వినోదము ల్గలయు నే♦ర్పారంగ నాడింతు వీ
సరణి న్బల్కగ నేర్తు రెవ్వ రఖిలే♦శా యార్తరక్షామణీ! ౧౮

మ॥ అతినిందాన్వితదుర్యశంబు బలె దే♦వా నీగుణశ్రేణి సం
తతకౌటిల్యరసప్రమాదయుతమై ♦ తత్పూర్వసంబంధవి
శ్రుతరాగప్రమదానుకూలసుగుణ♦స్థైర్యంబులు న్నీవడె నే
డిది నీకుం దగవౌన చెల్లు మిక తం♦డ్రీ యార్తరక్షామణీ! ౧౯

శా॥ కన్నార న్ననుగాంచి విన్నపము లా♦కర్ణించి నాదప్పులున్
మన్నింప న్పరమాత్మ నీవె కద బ్రే♦మన్నీవడ కైకొన్న నా
దీనత్వంబు హరింపబూనొకొను దయా♦ర్ద్రీభూత! రక్షింప నీ
కన్న న్వేరొకరుండునే నయవిలో♦కా యార్తరక్షామణీ! ౨౦

మ॥ చిరకారుణ్య మెలర్ప దైన్యవితతుల్ ♦ చేజేతల న్వోవగా
కరుణాలోకన మించుక న్నిడి శుభో♦త్కర్షంబులం జేయు నీ
బిరుదుల్ నిండె నజస్రమున్ దిశలనె♦ల్లన్ బోల్ప నాద్యంత మీ
వరకు న్నన్వీన లోభ మెంచు మిక దే♦వా యార్తరక్షామణీ! ౨౧

శా॥ లోనన్ యాదిదొలంగునంతవరకీ♦ లో నిట్లు ప్రార్థింతు నం
చాన న్వెట్టి ప్రతిజ్ఞ జేసితి దిశా♦శాంతంబు నిండార నీ
లోన న్గాదని గొంతసే పవుసటం♦చున్ లోభ మిక్లేల నీ
వున్నట్లున్న దెరంగు తెల్పవె స్వయం♦భూ యార్తరక్షామణీ! ౨౨

శా॥ నీలో నైజము నే నెఱుంగ నలతి ♦ న్నేర్పార నాశక్తికిన్
వీలైనంత వివేక మాత్మ నిడి ని ♦ న్నేమారు ప్రార్థించితిన్
నీలోపం బని నెన్నజాల నయము ♦ న్నేర్పార జింతింపుచున్
బాలన్మ్రొంతువొ నీళ్ళద్రోతువొ మహా ♦ త్మా యార్తరక్షామణీ! ౨౩

మ॥ కలుషోదంచితకాననోజ్జ్వలలస ♦ త్కాలానలాభీల సం
కలితోద్యద్ద్విషవర్గవిశ్రుతవిపా ♦ కప్రగ్రిశాధీశ బా
ల్పలర న్భక్తవికీర్ణనీరధి యన ♦ ల్పాబ్జప్రదీప్తిప్రభా
వలసన్నామ్రనిత మానిహృత్కలిత దే ♦ వా యార్తరక్షామణీ! ౨౪

మ॥ తరుణం బియ్యది ద్రోసినం దగవుగా ♦ దాద్యంతము న్బ్రోల్ప నీ
పరతంత్రం బఖిలప్రియుక్తము తుది ♦ న్బాటింపరాదయ్యె నీ
పరమప్రీతిదొలంగ కస్మదఖిల ♦ ప్రాపీయద్దైన్యావళుల్
పరగన్ ద్రుంపు మపారసద్గుణకలా ♦ పా యార్తరక్షామణీ! ౨౫

మ॥ దినముల్గడ్చితి విట్లు నాయెడ వి ♦ ఘ్నుల్ నెన్నంగ నైజంబులున్
గొనసాగె న్నిపుడింతవట్టు తుదను ♦ న్గీలొక్కన్న మార్గంబు లే
దనయంబు న్నిను వేడినందు కిటుమీ ♦ ద న్నిగ్గుగాకున్న నీ
నెనరుండాల్పవె నాయెడన్మిగుల దం ♦ డ్రి యార్తరక్షామణీ! ౨౬

మ॥ అరుదయ్యె న్భవదీయ సద్గుణములె ♦ ల్ల న్బ్రోల్పనేరం దయా
పరుడంచు న్నిని నమ్మిగొల్చితి నపా ♦ రప్రాగ్వ్యథల్ జూచినన్
దెరగుల్ జేయకసుశ్రితం బిటుల నా ♦ త్మోద్దేశ్యమున్నిల్పి నీ
సరసన్గూర్పు మశేషదీనజనపో ♦ షా యార్తరక్షామణీ! ౨౭

మ॥ మునునేజేసినదుష్కృతంబు లవి నె ♦ మ్ముల్నెల్లయు న్నిండెడి నం
చనుమానింప గుణంబుగా దరయ దు ♦ శ్చరిత్రము ల్మిక్కిలిన్
మనమార న్గొను నస్మదీయులను సౌ ♦ మ్యత్వంబులన్గూర్చి నే
డనుకూలింపవు నాయెడం దగునె దే ♦ వా యార్తరక్షామణీ! ౨౮

మ॥ సదుపాయం బెటులైన జేయవు దయా♦సామ్రాజ్య నీ కెన్నడో
మది సందర్భము గాక జేయు దల పే♦మాత్రంబు నాపట్ల లే
దు తు దిన్నులు కెట్టులౌనో మిగుల♦న్ఖేదింపరాకుండె నే
డిది సందేహము గాగజేసితివి తం♦డ్రీ యార్తరక్షామణీ! ౨౯

శా॥ భాస్వత్కోటిసహస్రతేజవిలసద్భ♦వ్యోన్నతప్రక్రియా
శశ్వత్ప్రస్ఫుటకాంచనాంశుకది♦శాశాంతప్రదీప్తోజ్వలా
విశ్వప్రార్థితవాహినీవలయ ♦ విశ్వోపేతభాస్వద్దయా
భాస్వద్విశ్రుతపాదపంకజ విధా♦తా యార్తరక్షామణీ! ౩౦

మ॥ అతిబాధ ల్దొలగించి నీ వవనిలో న♦న్నోర్చితు వెల్లం దయా
తతసమ్మోదము నొసర్చి సంతతవినో♦దక్రీడలు న్మీర నీ
యతనంబు న్వెలిగాక సద్గుణవిలో♦కప్రాప్తి నిండ న్మహో
న్నత సర్వజ్ఞులజేయనే నయవిధా♦తా యార్తరక్షామణీ! ౩౧

మ॥ పరుల న్వేడిన నేమినార్థకము నీ♦పట్లున్నికల్గాక నా
కిరువంక ల్జన దెట్లు నెమ్మనము నో♦లి న్నీయుపేక్షాబ్ధిలో
తెరువుంజాలక ముల్కులన్గొనుచు ము♦ఙ్గాలొక్కన్న కర్మోర్ము లి
ట్లరయ న్బెన్గొనె న్బ్రుబోత్రుతునో మహా♦త్మా యార్తరక్షామణీ!

మ॥ పెరవాడం చని నైజముల్గొని నెపం♦బుల్ నాయెడన్గల్గె ని
ర్భరదోషప్రతు లాత్మజుల్మిగుల యా♦పత్పూర్ణులు న్గాగ నా
దరమొప్పం జనజేయు తండ్రిబలె నో♦దార్ప్యందలంపొప్పదే
కరుణాసింధు యమేయభక్తజనలో♦కా యార్తరక్షామణీ! ౩౩

మ॥ ముఖరంగంబును నొవ్వ నాశిరము ది♦మ్ముల్గల్గి బాధింప నే
నఖిలప్రార్థితసన్నుతుల్ నెరపి దీన ♦ న్గోర్కె సిద్ధింప నీ
ముఖరంగధ్వను లే నెరుంగను నిజ♦మ్ముల్నాగనాపట్ల వే
రొక నైజంబును గల్గకుండఘువిదారీ ♦ యార్తరక్షామణీ! ౩౪

మ॥ చెడువార్తల్విని సైపగాహృదయముం♦జెల్వారె నాకున్మనం
బెడబాయం జన దెల్లదోషము లెడ♦న్బెంపొందుచుం ద్రోహసం
దడి లీలల్పెసగొంటి నింకిది మహా♦త్మా దీర్చి యెట్లైననా
యడరున్బోవగ జేయుమియ్యెడ నగ♦ణ్యా యార్తరక్షామణీ! ౩౫

శా॥ శారీరంబు లనిత్యముల్ యెటు లవస్థ♦ల్దీర గాపాడి నన్నీ
ఘోరారణ్యవినోదినై యలరతి♦న్గాని న్నె వృద్ధిక్షయ
ప్రారంభంబు లకర్మజంబు లోగి సం♦ప్రాప్తంబు గాకున్నె నిం
పార న్నిల్వవు గల్మిలేము లోగి దే♦వా యార్తరక్షామణీ! ౩౬

మ॥ కరుణాసింధువికీర్ణభక్తవిలస♦త్కల్పద్రుమా నాయెడన్
గరువయ్యె న్భవదీయసత్కృపవిలో♦కప్రాప్తికాలంబు నే
డెరవు న్గన్పడ దీయుపేక్ష గొనినన్ ♦ దైన్యస్థితు ల్దీరునే
పరమప్రీతిదలిర్ప బ్రోవు నయదీ♦పా యార్తరక్షామణీ! ౩౭

శా॥ ఆపద్బాంధవ వేడితి న్ననయు నీ♦యాపత్ప్రపంచంబు నా
కీ పట్లం దొలగించి గావు మిపు♦డింకన్ సందియంబేల నే
ప్రాపున్గన్పడ దిట్లనూన్యగతికి♦న్బ్రాప్తుండనైతి న్భవ
త్కాపేయం బిపులుండ జేయుము విధా♦తా యార్తరక్షామణీ! ౩౮

మ॥ అవకాశంబును గల్గకుండ నొకవే♦ళన్నీకు నశ్రాంతముల్
సవిశేషప్రతిబంధకంబులనిన♦న్సందేహమున్గాన నీ
వు వచోదానమొసంగి దైన్యతతి లా♦వుల్దీర్చి రక్షింపవే
నివిపత్కర్ణము వోవునెట్లు గుణరా♦శీ యార్తరక్షామణీ! ౩౯

మ॥ నిరతి న్నేనొనరించు పాతకములె♦న్నో లెక్కకున్వల్లతే
దరయ న్బోవె నెటులైన తత్కలది సం♦దర్భంబుగాకున్న నే
తెరగున్బ్రోచితి వెందరి న్మ్రుకుల మం♦దో బ్బంట్లం దలంపొప్పదే
నిరమావల్లభ దెల్పవే భయవిదా♦రీ యార్తరక్షామణీ! ౪౦

శా॥ ఆపద్బాంధవ దాపు నీవని మదిన్ ♦ దర్శించితి న్నాని నీ
కాపేయంబుదలంప వేరొకవిధ ♦ న్కర్తవ్యమున్నొండె నిం
కేబాధిపు న్నని దాల్మి కల్గు నిది నీ ♦ లోపంబునన్ గాదె నీ
పీపట్లన్నని బ్రోవుమయ్య యఘుభే♦దీ యార్తరక్షామణీ! ౪౧

మ॥ పరమార్థంబున కిచ్చజేసి మిగుల ♦ న్బల్గొక్కినై యున్న నా
దురవస్థ ల్దొలగింప గూడని విధు♦ల్దొతెంచె నీసందునన్
బరికింపన్మనను గోరలేద సదులాభ♦ప్రాప్తియు న్నాన నీ
దరికిం దోయవె నమ్మితిన్ యఘువిధూ♦తా యార్తరక్షామణీ!

శా॥ బాధల్మిక్కిలి నాయెడ న్ప్రబలె నే♦ర్వారన్ దదుద్రేకమా
వాతందోయకు నమ్మి నీవిపుల వా♦త్సల్యంబుల న్బోలు నీ
లో తెల్లన్ననుగొంటి నియ్యెడ దయా♦లోపంబు లేకుండుటన్
గాదే వేడితి వేదవేద్య నయలో♦కా యార్తరక్షామణీ! ౪౩

శా॥ యేకాలంబునకైన నీకృపకు బా♦తుండౌదు నం చాత్మయం
దేకధ్యానవిధు ల్దొలంగక మదిన్ ♦ ధైర్యస్థితి న్గల్గి నే
బెక్కుల్ జేసితి బ్రార్థనల్ దలపు నా♦పై నిల్పి రక్షింపు నీ
దిక్కున్ లోపము లెన్నక న్నయవినో♦దీ యార్తరక్షామణీ! ౪౪

మ॥ కరుణాలోకన మించుక న్వశముగా♦క న్నుండుమార్గంబు లే
కరణి న్గల్గిన డెల్ల వైన్యవితతు ♦ ల్దారింప న న్నిప్పు డిం
కరయ న్నీతలపొప్పకున్న విధము ♦ న్గన్పట్టు సర్వాత్మ నే
దెరగున్గన్పడ దెందు ని న్నినవినో♦దీ యార్తరక్షామణీ! ౪౫

మ॥ వెలసె న్నీకడునాజ్ఞ లోకవితతి ♦ న్విశ్రాంతమై గ్రమ్మెచున్
గలయ న్బోల్పగ లోవెలిన్నెగడి యే♦కగ్రీవమై సల్లడల్
బలురీతు ల్గానసాగె నీవశము లో♦పల్మీరి యెల్లున నా
కిల నల్లాడున నొక్కసారె యఘుభే♦దీ యార్తరక్షామణీ! ౪౬

మ॥ సమయం బియ్యది గాదన న్వలదు మున్ ♦ సర్వేశ నిన్నొప్పగా
సమయావస్థ లెఱింగి జేసినవిధుల్ ♦ సందేహము ల్గావు నీ
సమయంబుల్ జనజేతు వంచని దురా♦శ ల్గూడ దెంతైన నా
కమితంబు ల్వల దీవు గన్గొను విధా♦తా యార్తరక్షామణీ ! ౪౭

శా॥ నాకున్ దైన్యవిధుల్ దెరల్చి మిగుల ♦ న్నానాటికిన్ అంబుదో
ద్రేకంబు న్బలె నావరించె తుదకున్ ♦ బల్ద్రోహవిశ్రాంతమై
నీకున్ మ్రొక్కెద నీనయప్రథిత♦నిర్ణిద్రాశుగప్రోద్ధతిన్
లోకాతీత తొలంగజేయవె కృపా♦ళూ యార్తరక్షామణీ ! ౪౮

శా॥ గాథల్ నీయెడ బెక్కులున్గలిగె ని♦క్కంబెట్టు గాదందు బల్
బాధాప్రేరితు లెందరెందరము నీ ♦ పాదాశ్రితు ల్గాగ ము
మ్మాదార్ప న్బని నీదెకా గొరులు నెమ్మిన్బ్రోచువారేరి నా
కేదైన న్నొకదారి జూపు మిక తం♦డ్రీ యార్తరక్షామణీ ! ౪౯

మ॥ పరితోషంబు మనంబున న్గానవు నాప♦ట్లింక గ్రోధంబు ని
ర్భరమై యున్నది నీకడ న్మిగుల దు♦ర్భావంబున న్నేనె గా
కొరుల♦న్గన్గొను మన్ని దీప్రుల వి♦కీర్ణద్రోహులన్నెల్ల నే
కరణి న్బ్రోచితి వట్లొనర్పు మకలం♦కా యార్తరక్షామణీ ! ౫౦

శా॥ వాదంబు న్బనిగాదు నా కిపుడు నీ♦వాక్యంబు విన్నంత నే
బాధ ల్గల్గిన నోర్తుగా కని మనం♦బార న్నుపేక్షింప నీ
వీ దిక్కు న్బరికింపకుంటివి మది ♦ న్వైరొందు నైజంబొ ? నే
డేదైన న్నొకమాట దెల్పు మిక తం♦డ్రీ యార్తరక్షామణీ ! ౫౧

మ॥ పరమాత్మా వెలిజేసి న న్నొకని యా♦పత్పూర్ణుని న్గాగ నా
తెరగు న్నివిటు లుండజేసితివి నిం♦ద్యోపేతుడా గావె నీ
పరమప్రీతి దలిర్ప బ్రోవవు నన♦ల్పక్లేశసంపూర్ణునిన్
వెఱపింతై నను మాన్ప వీసరికి తం♦డ్రీ యార్తరక్షామణీ ? ౫౨

శా॥ నే నీనాటికి నాడు వాగ్వ్రతతు లె♦న్నో ప్రార్థనల్గాగ నే
గన్నార న్ననుగొన్న దెల్లయు భవ♦త్కళ్యాణరూపంబుగా
గ్రన్న న్నేల సౌందర్య చెల్వు లొగి ♦ దేవా నిన్ను కేల్మోడ్పుగా
నిన్ను న్గొల్చితి బ్రోవవే భయవిదా♦రీ యార్తరక్షామణీ! ౫౩

మ॥ తెరపై నల్లడ బొమ్మల న్నడి తదు♦ద్రేకప్రభాకీర్ణ సం
భరితప్రాభవ మెల్లయుం గరపి నే♦ర్పారంగ దత్కూటమిం
గరమొప్పం దొలగించు నట్టి బలెం ♦ గాజేతు వెల్లం జరా
చరజీవప్రకరంబుల న్గుణవిభూ♦షా యార్తరక్షామణీ! ౫౪

మ॥ అతిలోభంబు దవుల్కొన న్నమితసా♦మ్రాజ్యంబుల న్గూర్చి సం
తతధర్మజ్ఞులు గాని మూఢుల బలెం♦ న్ఘోరంబుగా బుణ్యసం
పదల న్గల్గియు నేరికి న్నిడవు నీ♦పుట్టమియు న్మగ్నై యు
న్నతధర్మంబు దొలంగగూడునె సగ♦ణ్యా యార్తరక్షామణీ! ౫౫

మ॥ తరుణంబుం గనుగొందవో తలపునం ♦ దాత్పర్యము న్గాదొ నీ
కరుణ న్గల్గదె నేడు నీహృదయసం♦కల్పంబ దెట్లున్నదో
తిరము న్గాని యవస్థ గల్గినదొ నే ♦ నెట్లైన బోల్ప న్మహో
దర మొప్పం దొలగించి ప్రోవు పరమా♦త్మా యార్తరక్షామణీ!

మ॥ చెలులోనం గల మానవున్నతె మన♦స్థైర్యంబునుం బాసి నీ
మరుగుం జొచ్చితి నిట్టెడ న్నిగుల న♦స్మద్దైన్యము లోర్వ నీ
వర కేదైన కటాక్షము న్నొదవ దా♦వంతైన నీసందునం
తరము న్గానిదికాదు నీ కిది మహా♦త్మా యార్తరక్షామణీ! ౫౭

మ॥ చపలుండం జడుడం ఖలుండ నమిత♦క్రూరుండ సంభావ్యుడం
గపటస్థాయవినోదవిభ్రతిగుణా♦కల్పైకదుర్జాతుడం
అపకారప్రతిబంధకుండ నవని న్న♦త్యంతధూర్తుండ నీ
యపకృత్యంబుల నెట్లు సైతువో యమే♦యా యార్తరక్షామణీ!

మ॥ మును నీలోపల నాత్మబంధువులె నేమున్నాక సర్వేశ నో
పినరీతు ల్గని దైన్యసంతతుల రూపుల్మాపి రక్షించి తీ
ర్పు నయంబేది తలంప నీదెస నిమ[illegible]ంప న్గుణంబేది నా
కనుకూలుండవు గావొ దెల్పు మకలంకా యార్తరక్షామణీ! ౫౯

మ॥ అవనిం దామరసప్రసూనరసహారాస్వారలోకంబు ల
న్నవయు న్గానక తత్పదస్థలి మనస్థైర్యంబును న్వీడి శే
బవలుఙ్ గ్రుమ్మరు మండుకంబుబలె నీభాస్వత్కృపారాశి నే
నవిసీతి న్గాని పోల్పనై తిని విధాతా యార్తరక్షామణీ! ౬౦

మ॥ దిర మొప్ప న్గదు శౌర్యసాహసమహాధైర్యప్రభావస్థితుల్
గర మొప్పారగ బల్మి కల్మి మృదువు న్గర్వంబు బల్గొప్పలుఙ్
బరగ న్మార్దవశక్తియుక్తు లలతిప్రాబల్యము న్గాన నీ
సరికి న్నెపని నమ్మి గొల్చిత [illegible]లేశా యార్తరక్షామణీ! ౬౧

శా॥ లోకాధీశ సమస్తలోకవితతుల్ లోకేశులుఙ్ లోకులుఙ్
నాకేశస్తుత యొక్కసారె తెగి నన్యాలోకను ల్గాక నే
లోకు ల్గప్పడ కట్లలోకు లగుటఙ్ నాలో నగల్పొంత మం
దేకగ్రీవమున న్వెలుంగ దఘభేదీ యార్తరక్షామణీ! ౬౨

శా॥ దుర్భావజ్ఞుడ నేను నిర్దయగుణాకల్పుండవు న్నీవు నే
గర్భస్థుండను నేను గాటిలకళాకల్పుండవు న్నీవు బల్
నిర్భాగ్యుండను నే ననింద్యమగుభాగ్యోపేతుండ వీవు నా
దుర్భ్రాంతస్థితులం దెరల్పు మఘభేదీ యార్తరక్షామణీ! ౬౩

మ॥ అపరాధి న్నని నింద్యమొందితి మహాత్మా ప్రిక్షరిశ్రాంతిచే
నపవాదంబులుగల్గె గాన గుణదోషప్రక్రియల్ సూడ కీ
విపరీతప్రతిబంధకంబులనఙ్ వేమేల నాపట్ల నీ
కపటభ్రాంతి దొలంగకుంటి వకలంకా యార్తరక్షామణీ! ౬౪

శా॥ దేవా నాయపరాధముల్ సయిపవే♦నోర్చి దీవుల నోర్పఁగాఁ
నీ వెందెందున బ్రోచినట్లె విప♦ద్విశ్వప్రమాదంబులన్
దీవిం దూలిన నన్ను గైకొనవి దెం♦దు న్ప్రాకృతంబౌనె నా
యావిన్నీడక గాని ప్రోవవు సగ♦ణ్యాయా ర్తరక్షామణీ! ౬౫

శా॥ భోగేచ్ఛన్పుడి కొన్ని నా ళ్ళకట ని♦న్ను న్నోర్ప కజ్ఞానినై
లోకేశస్తుత యిట్లు వేసితి దయా♦లోకంబునన్ లోపముల్
నాకు న్నేర్పడకుండఁ జేయవె యనూన♦ప్రాగ్వ్యథల్ జూడకే
నా కీపట్ల దరింపఁజేయుము విధా♦తా యార్తరక్షామణీ! ౬౬

మ॥ పలురీతుల్ భువనంబు లొక్కతఱిలో♦ప ల్ద్రోతు వొక్కప్పుడున్
వెలికిం దీతు వసంఖ్యలై కలయ నీ♦వు న్నేరికి న్గానరా
వలతి న్నేల్పగ బ్రోతు వెల్లయును దే♦వా నీకృపారాశిచే
పలుమా రియ్యెడ నీవినోద మఖి♦లేశా యార్తరక్షామణీ! ౬౭

మ॥ పరమానంద మెలర్ప జేసితివి లో♦పం బేమియు న్గాక నీ
వర కెల్లన్గడు దీనమానవుల దే♦వా నాయెడ న్గూడదే
పరమప్రీతి వలపఁ వేడిన నసం♦భావ్యస్థితుం జేసి నీ
కరుణ న్వేడితి నాయెడ న్దయవిలో♦కా యార్తరక్షామణీ! ౬౮

మ॥ భవదీయాద్భుతమాయలం బడి వినో♦దభ్రాంతచేతస్కులై
వివశత్వంబు దవ్వులొన నిమ్నగుల సం♦జ్ఞల్గాగ బ్రహ్మాదులున్
అవని న్బిల్లతిదోఁప్రయుబొమ్మలకిప్రియ ♦ న్నస్వస్థులై యేదియున్
నవగాహంబు గొనంగజాలరు మహా♦త్మా యార్తరక్షామణీ! ౬౯

మ॥ గుణివో నిర్గుణివో గణింపఁగల ప్ర♦జ్ఞోత్కృష్టవిశ్రాంతులై
వినుతప్రాభవ నీకృతంబు దెలియ న్వి♦భ్రాంతులు న్గాక స
ద్గుణులై యున్నను నిన్ను బోల్పక వియో♦గుల్గారె యోగీంద్రులె
ట్లనకే మాంద్యము నొంది కార్యజనలో♦లా యార్తరక్షామణీ! ౭౦

మ॥ ఏవో తప్పులు చేసియుందు నవియు♦ద్దేశింపగాబోల ది
క్లేవో కల్గిన నింతజేసితివి నీ♦లోపంబు గల్గెం దయా
భావజ్ఞుండవు నీవెగా కొరుల బో♦వన్నాడియా నెట్లు నో
దేవాదేవ హితప్రమోద యఘభే♦దీ యార్తరక్షామణీ! ౨౦

మ॥ తడ విట్లుం జనజేసినం దగునె నీ ♦ తాత్పర్యము న్బోల్ప ని
య్యెడ నన్ను న్వినన్నెగ్గుసేయునది నా♦లోనంత వీక్షింప నె
య్యెడ గాన న్వినవెందు నస్మదఖిల♦క్లేశప్రమాదంబు లే
వడుపుం ద్రోతువా నీవె తండ్రి గతి దే♦వా యార్తరక్షామణీ! ౨౧

మ॥ తలపన్నేరని యాపద ల్గలిగె మ♦త్ప్రాచీన కర్మస్థితుల్
వలనో లేక పు డేను జేసినవో దే♦వా యెట్లు ప్రార్థించినన్
దెలియన్ రా దఖిలేశ నీయెడల ను♦ద్దేశంబు నెట్లైన నీ
దలపు న్నాయెడ నిల్పినం జను నతీ♦తా యార్తరక్షామణీ! ౨౩

మ॥ సమయావస్థ లెరుంగరా దితరసా♦హాయ్యంబులు న్వల్లగా
దు మనంబారగ గానుకల్వలదసా♦ధ్యుల్ సాధ్యుల న్గాడదీ
విములోద్యోగప్రభుత్వ మిట్టిదని నీ♦వున్బ్రోతువెల్ల న్వాదం
బము లల్పప్రభులందె గల్గు గుణక♦ల్పా యార్తరక్షామణీ! ౨౪

మ॥ అననిన్ దిప్యమ్మరిగేల్యుగంబున న♦నూనస్థైర్యము నొప్పలనో
క్క విక్రీర్ణంబగు వేణువు న్నలమికొంచ♦ద్దాని గీతాక్కన్న మా
నవు నేర్పారగ బ్రోచినప్పలె తుద న్ప్రా♦షంబున్నిల్పియుం
టివి నన్ బ్రోయ కథోముఖంబునను తం♦డ్రీ యార్తరక్షామణీ! ౨౫

మ॥ నిను దీనావను డంచు నెన్నిరి బుధుల్ ♦ నిక్కంబుగా దియ్యెడన్
వినగన్ జొప్పడకున్న దీవిషయము♦ల్పెశ్వాత్మ మద్దైన్యముల్
జనిన న్గాక మనంబున న్మిగుల వా♦స్తవ్యంబును న్నాడ దీ
పని నీకల్వడదేమొ తెల్పు గుణక♦ల్పా యార్తరక్షామణీ! ౨౬

శా॥ దేవా మత్ప్రతిబాధలున్విధికృత • స్థైర్యంబులై యుండినా
యావిస్గళినంతకు న్విడువ కేట్లత్యద్భుతం బయ్యె నీ
భావం బియ్యెడ గల్గకున్న తుదకు • న్బల్డోసమున్గాదె నీ
లోవెత్రిం దొలగించి ప్రోవు మఘభేదీ యార్తరక్షామణీ! ౭౭

మ॥ ప్రతినిత్యంబు మదీయగర్భపరిపోషావస్థ లెల్లన్ సము
న్నతి నస్మద్వ్రతవద్విధానములుగాఁ గన్ నేర్చితిన్గాని నా
యతనంబు న్భవదీయపాదములవంకన్ న్నార నూహింప లే
దు తమోగ్రస్థితి దీర్పవే సుగుణవేదీ యార్తరక్షామణీ! ౭౮

మ॥ శరణన్న న్బుధదీనుల న్విసువక న్కాశేష్త్ర రక్షించి నే
డరుదయ్యె న్గుణరాశి సజ్జనుల జూడన్బ్రోవ నట్లుండి నే
తెరగై నం దొలగింప బూనితివి నిందోద్యోగ చేతుమాన్ గావె నీ
సరస స్వేల్పుడి నట్లు జేయు మఖిలేశా యార్తరక్షామణీ! ౭౯

మ॥ అపరాధప్రతిబంధకంబులై మదపాయ్రకైక నామాంగ్రిజ్యముల్
విపరీతప్రతికూలనింద్యములై మద్విఖ్యాతవిశ్వాంబులున్
అపచారప్రతికల్పవర్గములై సస్మద్భాగ్యసంకీర్ణముల్
కపటోపాయమె మద్వినోద మకలంకా యార్తరక్షామణీ! ౮౦

మ॥ నెరిదప్పం దగదిట్లు నాయెడల సేనై జంబులు న్వేరుగా
గరమావల్లభ అస్మదీయయెడ దింకన్ లోవగా జేసుసం
చరయ న్గా దిది బోలునే నయవిశేషప్రావిలాసంబు లే
కరణిన్నిన్ను దొలంగ నయ్య గుణలోకా యార్తరక్షామణీ! ౮౧

మ॥ నిరతి స్నివిలగూర్కమేరగలసంచు న్నెన్నిక న్గాసె స
తరము న్గాదిది సమ్మతాలను మహాత్మా నిక్రమం చెంట కీ
సరస న్నిల్చిన యస్మదీయవినుతుల్ శ్రీవ్యస్థితుల్ గ్గావె లో
తరయన్ సంశయ మీవిశేషము మహాత్మా యార్తరక్షామణీ!

మ॥ తనరె న్నీకృప నెల్ల దీవులను జూ◆డంజూడ దైన్యప్రభా
జనులందు న్వెలిబాసె నే నిడుము లందన్ ◆ సాజమున్గాగ నీ
మననుందున్గల నైజముల్ దెలసె న◆న్నీవారు రక్షింపకుం
డిన నిష్కల్మషు డంచనం జనునె తం◆డ్రీ యార్తరక్షామణీ! ౮౩

మ॥ దురితప్రాగ్భ్యులు నీకృపానితతికిం ◆ బాల్కొన్నది న్వింటి నీ
వర కెందెందరు దెల్పినం దగునె దే◆వా నీయజాండంబులం
దరయ న్నన్వెలిగాగజేసిన విధం బె◆ల్ల న్నయోగ్యంబు లే
నరణి న్బొల్పగ బ్రోవుమయ్య యఖిలే◆శా యార్తరక్షామణీ! ౮౪

మ॥ నరులుం జేయు సుకృత్యదుష్కృతము లెం◆న్నన్గల్గి బల్వేషముల్
బరగగొల్ప వినంగ నుద్యమము లే◆పారంగ సంధించి బ
ల్వరు నాపాపాత్మ్యలజన్మముల్ జరుపును◆గ్రిన్నారలీల ల్వినన్
పరమక్లేశము గల్గ బ్రోవ పరమా◆త్మా యార్తరక్షామణీ! ౮౫

శా॥ దేవా దేవకులాగ్రగణ్యు డని ముం◆దెబ్బంగన్ నిన్నున్ వెల్పిరో
భావింపం బారవస్మదీయ జెవుల◆న్నాల్మారు నీయంశమున్
నీ నెల్లన నయంబు పీడవు తుది◆న్నీచిత్రము న్గాన నిం
కె వెల్లు గ్గని ప్రోతువో భయవిదా◆రీ యార్తరక్షామణీ! ౮౬

శా॥ దుర్యోపాయములం దవుల్కొని మదో◆ద్రిక్తుండనై యుంటి నే
దుర్యోగం బుపసంహరింపక మహో◆దుర్వార్తికి న్నిర్మలమై
దుర్యోగస్థితి దాల్చితి న్వెరపు దో◆రంబయ్యె నీపట్ల నా
దుర్యోగంబు దొలంగజేయు మఘభే◆దీ యార్తరక్షామణీ! ౮౭

మ॥ చెదలు న్బుట్టినసస్త్రువు న్బులె న శే◆షవ్యాఘు లత్యంతమున్
బాదివె న్స్థితి దగుల్పడ న్మశుల నె◆మ్మిన్మొప్ప విశ్రాంతమున్
గుమార మద్వపుగీటణాంచె నను నిం◆కీప ల్లువేక్షింపగా నీ
కదియే ధర్మగుణంబు దెల్పు మఘభే◆దీ యార్తరక్షామణీ! ౮౮

మ॥ భవదీయాద్భుత మాయలం దగిలి విభ్రాంతస్థితోపేతులై
వివశత్వంబు దవుల్కొనన్ మిగుల నజ్ఞుల్గారె బ్రహ్మాదులున్
దివిషద్భవ్యులజస్ర మేను దురితాభోగక్రియాలోలుడన్
అవినీతిన్నను నెంచగా వశమె దేవా యార్తరక్షామణీ! ౮౯

మ॥ కలయన్మారిన వృక్షశాఖ గొన నంటన్బ్రాకి నిల్వల్ల సం
చలనంబున్గొను దుర్బలున్బలె చర్చింపంగనట్లూర్ధ్వ సం
కలితుం జేసితి నేమరుం దొలగకుండన్గావు మెల్లైన నీ
దలపున్వీడిన హాయిగల్గును విధాతా యార్తరక్షామణీ! ౯౦

మ॥ మును నీలోపల నాత్మబంధువులె నేమున్గానక సర్వేశ నో
పినరీతిన్గని దైన్యసంతతుల నేపుం దీర్చి రక్షించి తీ
వు నయం బేది దలంప నీదెస వినిందోద్దేశము న్గాదె నీ
వినుతప్రాభవ మెందు వోయె నిక తండ్రీ యార్తరక్షామణీ! ౯౧

మ॥ నెరసె న్నీగుణరాసు లెల్ల జగముల్ నేర్పార నీసత్కృపా
పరమప్రోద్ధితరాశి మాత్రము విలోపంబయ్యె నెట్లుంచినన్
పరితోషం బొనరించి దీనులెడ నాపద్బాంధవం బుంచి ని
ట్లరయన్గాక దయాత్ముడం చనరె దేవా యార్తరక్షామణీ! ౯౨

మ॥ నిరతి న్నీపదపంకజప్రణుతు లేను న్నేర్చి నట్లెల్ల నా
తురతం జేసితి దప్పుగావు నయము న్నేర్పారగా దీని వే
కరణిం జేతువొ నీమనం బలతి గాన న్వల్ల లేదింక నీ
దరికిం ద్రోయు మపారదుర్ణయవిఘాతా యార్తరక్షామణీ! ౯౩

మ॥ తెరగేదైనను దెల్ప వీసరి కనన్లోప్రద్దేశము న్వీడ నా
దరము న్గాని యవస్థకు న్గలయగాధ ల్బెక్కులు న్గల్గెనో
పరమోద్దేశము లేక నిట్లు నెపము ల్పల్కారు నీకబ్బెనో
అరయన్రా వెఱలైన సద్గుణనిధానా యార్తరక్షామణీ! ౯౪

మ॥ శరణన్న న్గని యెల్ల దైన్యతతులం ◆ జేసేతల న్బ్రోచి నీ
సరస న్గొల్వ ననుగ్యత ల్గరపి నా◆సందింతలోపంబులన్
బరగంజేసితి విట్లు నియ్యెడ ననం◆భావ్యంబునున్గాదె నీ
పరమప్రీతిదొలంగ కుండు నయదీ◆పా యార్తరక్షామణీ! ౯౫

మ॥ కొనలంటె న్భవదీయసద్గుణము లే◆కగ్రీవమై నల్గడల్
వనధిన్బ్రోలె విపత్పరంపరలు దే◆వా నన్దవుల్కొన్న నే
గుణము ల్గన్పడ నెట్లు గ న్గొనిన నా◆కు న్గాని మార్గంబె నీ
కనుకూలంబగు ధర్మమార్గ మకలం◆కా యార్తరక్షామణీ! ౯౬

శా॥ లావున్ జెల్లెను ధైర్యముం దొలగె లీ◆లన్ సన్నమయ్యె న్మహా
దీవిందూలె జరాభరంబు దగిలెన్ ◆ దైన్యంబు నిండారె నా
జీవంబుల్ చలనంబులయ్యె గడు దే◆జం బంతయు న్మాసె నా
కేవంక న్గని ప్రోతువో యఘవిదా◆రీ యార్తరక్షామణీ! ౯౭

మ॥ గణుతింపన్వశమౌనె నేరికి భవ◆త్కారుణ్య బల్దీవు లె
ల్లను నీవిశ్వము లంతటన్ వెలసె ని◆ట్లావంత ని న్బ్రోల్పజా
లను నీకుం దలపోయుసట్టి విధు లె◆ల్ల న్గాననేరన్ కృపా
వనధిం దేల్పవె దీనుడ న్మిగుల దే◆వా యార్తరక్షామణీ! ౯౮

మ॥ నను బ్రోల్పం దలపొప్ప దేని దెలుప◆న్నాపట్ల సందేహమే
వినుతప్రాభవ నీకటాక్షవితతు◆ల్విశ్రాంతము న్గాన నీ
వని సర్వంబును నమ్మికొల్చితిని దే◆వా నామనంబార నే
డనఘా యెట్లు సముద్ధరింతువో మహా◆త్మా యార్తరక్షామణీ! ౯౯

మ॥ అవని న్వేంకటరాఘవాత్మజుడ నం◆తయ్యాఖ్యుడన్ బ్రేమ స
ద్భావంబుండ న్భవదంకితంబుగ మదీ◆యావస్థలు న్బ్రోవ నీ
స్తవరాజంబు రచించి నే డిది మహా◆త్మా నీకు నర్పించితిన్
సవరింపం జను దేవ దీనజనపో◆షా యార్తరక్షామణీ! ౧౦౦

సంపూర్ణము.

# శ్రీకృష్ణునకు సత్యభామ వ్రాసిన ఉత్తరం.

రేగుప్తి – కళ్యాణి – రాగం

( హాయిరీ యీరాగములతో చదువవలెను )

శ్రీమదభిమా రమణీ మణీ వినిర్మిత మానసోల్లసిత విభ్రమ లతా సమంచిత హారిద్రవనీ ప్రసూన లీలావిశేష సుభద్రి యళీవిలోల విలాస భాసితులైన॥ ౧

సకల చరాచర జంతు సముదయ సమేత చాతుర్వర్ణ్య ప్రకార చమత్కార సముచిత సకల ప్రాణి కలప్రపంచ సంచయ సమావేశ సంభవ సంభరిత సమస్త హేతుకారణ ప్రధాన పురాణ పూరుషులైన॥ ౨

విలయకాల కరాళ కాలప్రభా సమేత యతులిత వలాహక విశేష జాల వినీల మణిప్రభా నిభశుభాంగులైన॥ 3

శ్రీదేవకీదేవి సద్గర్భసమంచిత నదీనాయక రాకానిశాకరులైన॥ ౪

మత్ప్రాణనాయకులైన॥ ౫

శ్రీకృష్ణమూర్తి వారి నవీన భువన జనిత సమాన మానిత నవ్య కమనీయ దివ్య భవ్య శ్రీపాదంబులకు నిత్య సత్యవ్రత సత్యభామా మణి యత్యంత నితాంత సంతత సంతసిత సహిత విహిత స్వాంత సమేత ప్రశస్తహస్త సహస్ర పత్రాంజలి పుటఘటిత నికటతట నిటలయై యనేక నమస్కార సహస్రంబు లొనరించి వ్రాసికొనిన విజ్ఞాపన పత్రిక॥ ౬

ఇచ్చటభవత్కటాక్షాయత్తక్షీణ వీక్షణ విశేష అస్మత్కనక నికేతనం బఖిలంబు నిత్యంబు శుభంబున నొప్పియున్నయది॥ ౭

అచ్చట తమదగు అశేష శాశ్వత సకలసామ్రాజ్య లక్ష్మీవిలాస విశేషధైర్యస్థైర్య శౌర్య విజయ గజ ఘటాశ్వ భట ప్రకటిత

సకల పరివార శుభవిభవము లనుదినము వర్ధియించి పంపిం
చెద రనినెపంబున నెదురు చూచుచున్న దాన॥ ౮

తరువాత ఘనుండు మజ్జనకుండగు సత్రాజిత్తు మహనీయ మానిత
శమంతకమణిసహితంబు గ్రమంబున న్గొని సాలంకృత కన్యా
దాన పూర్వకంబుగా నందం బగు కందుక మందిచ్చు చందం
బున సందడిగొని సుందరవదనారవింద నగు నన్ను తమకు
సమర్పించినదిమొద లనేకకాల మలవిగాని వలపు నెలకొని
నిలుపజాలకున్న నన్ను జెన్నొందవ నున్నతంబగు సాదరాలింగ
నంబు జేసి॥ ౯

కొంచెము నించువిలుకాని నెంచక మించి యద నెంచి యించుమించు
లేని పంచశరుని కదనంబు సహించి భ్రమించి న న్నతులగతుల
రతుల నలరంజేసి॥ ౧౦

అంతట నిసుమంత వైరంబున పంతగించి యంతకంతకు నాదగు చెంత
బాసి యత్యంత సంతసంబున రుక్మిణీకాంతయం దెంతయు
బద్ధానురాగులై యుంటిరి॥ ౧౧

ఇచ్చట వెలగల జాబిల్లి శిలల వెల్లువలై యల్లుకొని వెదజల్లి చల్లగ
నివ్వటిలు కమ్మనిరత్నంబు లనేకంబు లిమ్ముగ నిర్మించి యెంచ
దగిన కాంచన సముంచిత హర్మ్యాంతరంబున॥ ౧౨

నిగనిగ ల్గులుక తళుకుతళుక్కన ననల్పశిల్పికల్పిత అతులిత లతా
వితాన విలాసంబుల బెళుకుగులుకు సుకరంబులగు ముకురంబు
లనేకంబులు నలుదిక్కుల వెలుంగ॥ ౧౩

ఇంపగు గపురంపువాసనల బెంపుసొంపు సంపాదింప సుగంధచందనా
గరు లాదిగా గల బంధురంబులగు పరిమళంబు లిమ్ముల ఘు
మ్మని చలింప॥ ౧౪

జిగజిగలాడు జిగిబిగి నిగనిగల్గులుకు తొగలరాజాలవెల్గు నగిషీ విలాసం
బుల నుల్లసిత లతాపుంజంబుల ధగధగ మెరయు మగరాల

నెగడు సరిగెంపు జిగిసొంపు కనకంపు పవడంపు గోళ్ళమంచం
బునం దతులితవిలాసంబగు హంసతూలికాతల్పంబున॥ ౧౫

వెల్లువలగు చల్లసి మల్లెసుమంబులు నెల్లెడల కొల్లలుగా జల్లించి॥ ౧౬

పనప్పుడు తేటయగు గొజ్జంగి నీటను పాటవం బగు పన్నీటనీటిని
సూటిగా మజ్జన మాడి॥ ౧౭

హాయల్ గుల్కు మేలౌ గులాబీ కళల్ జిల్గుచెల్వొందు జల్తార్మలామా
పసందౌ జరీచలువపావడ ధరించి॥ ౧౮

చలువయగు చల్లని చలువరామొల్కునిగ్గు నిగారింపుమేలుప్పాల జల్తా
జరీ కావిముఖమాల్ హాయల్ జాబరా బెళుకుసరిగంచు
చీరె న్విలాసంబుగా గట్టి॥ ౧౯

బంగరు రంగు బెడంగుసంగతంబగు హొరంగు చెంగావి జల్తార్చుటే
కంగులం దీర్చు శృంగారమూపైటకో రవికయు దొడంగి॥ ౨౦

నిస్తులప్రశస్త కస్తూరి నిటలస్థలంబున కిస్తుగ దిలకం బొనర్చి ౨౧

సాంకవమగు మృగమదపంకసంకలిత పునుగు జవ్వాదిగంధంబుల కను
గుణం బగు చందనాగరు లాదిగా గల బంధురంబు లగు పరిమ
ళంబులు నలంది॥ ౨౨

నవ్యభవ్యకమనీయదివ్యాభరణభూషితనై తమరాక కెదురు జూచి నిదుర
మొదవిన సదనంబున శయ్య నొరిగి మది నొదవిన మదన వికా
రంబు కుదురుపరుచుకొని నిదురించి యున్నంత॥ ౨

మీ రిచ్చటికి వచ్చి మచ్చరంబున పెచ్చుపెరిగి పచ్చవిల్తుని పనికి హెచ్చ
రిక జేసి నిచ్చమెచ్చునచ్చునట్లు స్వేచ్ఛా విహారంబుల ముచ్చ
టించి కరంబుల కరంబు లురంబు లురంబు లూరువు లూరువు
గలసి మలసి డెమల్చి చుకుకుచురుకున నధరంబు రదనంబు
నొక్కి మక్కువ నెక్కొన పక్కబాయక చొక్క చెక్కిలి
నొక్కి గబ్బిసిబ్బెపు నిబ్బరంపు టుబ్బుగుబ్బచన్నులు గొబ్బు

గుదియచదియ నదిమి యొదవిన మదన కదన బోధన భేదనాది సాధనంబుల వదలక కదిసి యలసి సొలసి తడసి తుద కనేకగతుల రతుల దేల్చినవిధంబునస్వప్నంబయ్యె॥ ౨౪

అంతట మేల్కాంచి దిగ్గున లేచి నలుదిక్కులు గలయ బరికించిభవద్విలాసంబుగానక యోచించి నివ్వెరపడి చూచుచున్నంత॥ ౨౫

కమ్మనగు తమ్మితెమ్మెర నిమ్మగు తుమ్మెదలు ఘుమ్ముఘుమ్మని నెమ్మనంబు సొమ్మసిల దిమ్మరించి దుమ్ము గలుప॥ ౨౬

అద నెరిగి కోదమరాచిల్కకదుపు లెద మీరి మది దిగులొదవ రొదలు చేయసాగె॥ ౨౭

అరవిరివిరజాజి తరుల విరుల దొరని నెరసి మెఱసి యరసి కేరి మీరి కోరి శారికలు పరాకు దెల్పి చిరాకుసేయ॥ ౨౮

సరాళంబులగు మరాళజాలంబులు కలనాదకృత తాళ కలనంబుల విరాళినొందజేయ॥ ౨౯

విలాస లాస్య హాస్య గాన షడ్జంబుల కేకులు మూకలుగట్టి చికాకు సేయ॥ 30

మల్లెసుమసముదయంబుల చేకొని కొల్లలగు పరాగంబుల రాగంబుల నాని యాని యమునా భువన జనన వీచికానికర శీకర తుందిల కందళిత మందానిల మల్లసల్లన నుల్లాసంబున నివ్వటిలి తల్లడిలజేయ॥ 3౧

చందురుని కాకకు మనంబు చిందర వందరై కంది కుందుచున్న సమయంబున పొంచి పొదనుంచి మించి లంఘించి మేల్మెలంచు తెమకించి యించువిల్కాస్త్రి సుమశర పరంపరలు సంధించి లక్షించి నిగుడించి వంచించి చనినంత॥ 3౨

మనోజాత వేదనానల జనిత జ్వలన జ్వాలా పరివృతనై పరితపించి తల వంచి యోచించి నేదియుం దోచక భ్రమించి వలపు నిలుప నలవిగాక మెల్లన తల్పంబున మేనుసై॥ 33

శిలీముఖంబులు శిలీముఖంబులయ్యె అశుగంబు లాశుగంబులయ్యె పుండరీకంబులు పుండరీకంబులయ్యె శిఖిసముదాయంబు శిఖిసముదాయంబయ్యె వితానంబులు వితానంబు లయ్యె సాధనంబులు సాధనంబులయ్యె గాన నీయాపదలకు నోపజాలనని నీకాముకీధర్మమర్మ కర్మ ప్రవీణ పారీణు లనియు నవరసరసికశిఖామణు లనియు శ్రీ శ్రీ శ్రీ తులగాముపురినివాసులనియు బెహరావంశపయఃపారావార రాకాసుధాకరుడనియు అనంతరామయ్య పట్నాయక కవివరు నేలిన శ్రీ శ్రీ శ్రీ వేణుగోపాలు లనియు మంత్రార్థన గైకొన కర్త లనియు భావాభావవివేకపరిపూర్ణు లనియుమృదుమధురచతుర వచనరచనవాచావిశారదులనియు సర్వజ్ఞులనియు నాదగు దురవస్థలన్నియు బాయుట కలవిగాక విస్తరించి వ్రాయలేదు. చిత్తగించి తత్తరంబున విచ్చేతు రని ప్రార్థన చేయుచున్నదాన.

